Regd No. N/45 M.3

ఇరాఖులో జర్మను విమానాలు

నంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర వైశాఖబ॥ ౬ (౧౪-౫-౧౩౫౦ ఫ.) సోమవారము సం..

# ఇరాఖులో జర్మను విమానములు

## రషీదలీకోరుటచే వచ్చుట

ఇరాఖువ్యవహారములనుగూర్చి మే ౧౨వతేదినుండి ౧౨వతేదివరకువచ్చినవార్తలలో ముఖ్యమైనఅంశము రషీదలీగారు ఆహ్వానించినకోరుటచే జర్మనువిమానములు ఇరాఖులోకిచేరినవట. వాటిలో ప్రచారముచేసెడిరకములాటులు ప్రతికూల్యవారును ఇంకనునితరవిధముల నిపుణులుగు జర్మనులును, ఇటాలియనులును గలరట.

సుమారు ౩౦ జర్మనువిమానములు సిరియాలో మామూలువిమానాశ్రయములలో దిగినట్లును, అక్కడినుండి ఇరాఖునుపోవుచున్నట్లును కొందరుచెప్పుచున్నారు, ఆవిమానాలలో కొన్నిబాంబులు వేయునట్టివి కొన్నిటిలో సేనలుకూడ ఉండవచ్చుననుచున్నారు. సిరియా ఫ్రెంచిప్రభుత్వమునకు అధికారరక్షణమున పరిపాలింపబడుచున్నది ఇది యుద్ధానంతరముజరిగిన సంధిచేయబడినరాజ్యము. అందుచేతఇరాఖ్యాంలో ఫ్రెంచిప్రభుత్వమునకు అన్నిరకములహక్కులును వుండవు గాని విదేశీయులైనివారెవరుగాని సిరియాలో అడుగుపెట్టినచో విచ్చిలో ఉండే ఫ్రెంచిప్రభుత్వమునకు తెలుపకుండానే అట్టివారలను ఖైదుచేయుటకు ఇప్పుడుసిరియాలోవున్న ఫ్రెంచి హైకమిషనరుకు అధికారమున్నది. అయితేఇపుడు జర్మనుసేనలు సిరియాలోని విమానాశ్రయములనుపయోగించుకొనుటకు ఫ్రెంచిప్రభుత్వమువారు అనుమతించుటచే జర్మనువిమానాలు సిరియాగుండా ఇరాఖుకు పోగలుగుచున్నవి. సిరియాలోగాని సిరియామీదుగా ఇరాఖుపోవుమార్గంలోగాని యిప్పుడు ౫౦౦ మంది జర్మనులున్నారట. బ్రిటిషువారిప్పుడు తమ విమానాలకు సిరియాలో జర్మనువిమానాలు ఉపయోగించుకొనుచున్న విమానాశ్రయములపైబాంబులనువేయుటకు ఆజ్ఞ. తదనుసారంగా అప్పుడే బ్రిటిషువిమానాలుచర్యగైకొన్నట్లుగూడ వార్తవచ్చినది.

ఇరాఖుదేశరక్షణశాఖమంత్రి నజీషౌకతలీగారు తుర్కీకిపోయి తుర్కీవారు ఇరాఖువ్యవహారంలో మధ్యవర్తిత్వముబూని పరిష్కారముచేయుటకు రెండుషరతులను సూచించినారు, బాగ్దాలోదిగియున్న బ్రిటిషుసేనలు అక్కడనుండక అక్కడినుండి ఇరాఖుతెలుపక ఏదో ఒకచోటికిపోవలెననుపదిఒకటి. ఇరాఖులో బ్రిటిషుసేనలను పెంచుటకు రషీదలీగారికి సమ్మతమేకాని, ఏంతపెంచవలెనో, ఎట్లు పెంచవలెనో ఇంగ్లాండు ఇరాఖుప్రతినిధులతోగూడిన ఒక సంఘమునిర్ణయించవలెననునది రెండవషరతు. ఈ రెండుషరతులకు బ్రిటనుఅంగీకరించుచో ఇరాఖువారుపోరాటమువిరమించగలరట. కానిఈషరతులకు బ్రిటనుఅంగీకరించదుకాబట్టి ఈవిషయంలో తుర్కీమధ్యవర్తిత్వముచేయజాలదని స్పష్టపడినది. మే ౧౨వతేదిన నజీషౌకతలీగారు తుర్కీలోని రష్యారాయబారితోను, తుర్కీ అధ్యక్షుడగు ఇనూన్యాగారితోనుసంభాషించిరట. ఏమిసంభాషించిరో తెలియదు.

ఇకఈజిప్టుప్రభుత్వమువారు బ్రిటనునుఈ ఇరాఖుకు రాజకుదిర్చుదమనిచెప్పినమాటకు ఇంతవరకును రషీదలీనుండి ఎట్టిసమాధానముగాని రాలేదు.

ఈరాఖు ప్రభుత్వమువారితో రష్యాప్రభుత్వమువారు రాయబారప్రుసంబంధమును ఏర్పరచుకొనినట్లుగతసంచికలో తెలిపియుంటిమి. రాషిదలీకి ముందుమంటేఈరాఖుప్రభుత్వమువారుకూడ రష్యాతో రాయబారప్రుసంబంధము ఏర్పరచుకొనుటకై రాయబారాలు జరిపియుండిరి. కానిఅట్లురాయబారప్రుసంబంధము ఏర్పరచుకొనగానే రష్యాప్రభుత్వమువారు ఈరాఖుమున్నగు ఆరేబియాప్రాంతదేశములన్నియు స్వతంత్రములని అంగీకరించినట్లుగ ఒకప్రకటనచేయుటకు ఒప్పుకొనేపక్షములో రష్యాతో రాయబారపు సంబంధము ఏర్పరచుకొనుట తమకిష్టమని తెలియజేసియుండిరి కాని టువంటిషరతులకు రష్యావారిష్టపడక రాయబారప్రుసంబంధమును ఈరాఖుతో ఏర్పరచుకొనేవిషయంలోతొందరపడకుండిరి అంతటితో ఆవిషయమైప్రయత్నమును అప్పటిఈరాఖుప్రభుత్వమువారు కూడ విరమించుకొనిరి. కానిరాషీదలీగారు ఏషరతుగానిపెట్టకుండానే రష్యాతో రాయబారప్రు సంబంధము ఏర్పరచుకొనుటకు ఇష్టపడినందువల్ల రష్యావారును ఈపారిఅనుకూలించినారు.

ఈరాఖులో బసరాను బ్రిటిషుసేనలు ఆక్రమించుటతో బ్రిటిషుసేనలకు ఈరాఖుసేనలతో జరుగుచున్న పోరాటమునిలచినది ఇపుడుబ్రిటిషువిమానాలుఈరాఖులో జిల్లాలలోరాషిదలీపక్షపుతిరుగుబాటుదారులను శిక్షించుచర్యలనుచేయుచున్నవి.

తుర్కీలో జర్మనురాయబారియగు హెర్ వాన్ పేపన్ గారు జర్మనీకిపోయి హిట్లరుతో మాట్లాడి తిరిగితుర్కీకిచేరినట్లు గతసంచికలో తెలిపియుంటిమిగదా! వారు మే ౧౨వతేదిమధ్యాహ్నము తుర్కీఅధ్యక్షుడగు ఇనూన్యాగారిచ్చిన ఒకసందేశమునుఅందజేసిరి. అందులో మైత్రి లక్షణమున్నదని తుర్కీప్రభుత్వమువారు ప్రకటించినారు. అంతకుముందు పేపన్ గారు తుర్కీ విదేశాంగమంత్రియగు సారజోగ్లుగారినిదర్శించి మాట్లాడిరి, ౧౨వతేదినకూడ సారజోగ్లుగారితో సంభాషించి జర్మనీ తుర్కీతోస్నేహముగలిగియుండగలదనిచెప్పిరి. తుర్కీకూడ జర్మనీతోస్నేహముగలిగియుండవలెననిరి. తుర్కీకి మనస్సుకుసంకోచముకలిగించేఎటువంటికోరికనుగాని తుర్కీనిలదుగవలెనకోరలంపు జర్మనీకిలేదనిచెప్పిరి. తుర్కీగుండా జర్మనుసేనలనుపోనియ్యవలెననికూడ జర్మనీవారు తుర్కీవారినికోరరని పేపన్ గారుచెప్పిరి. ౧౨వతేదిన పేపను సారజోగ్లుగారితోసంభాషించినతర్వాత తుర్కీమంత్రివర్గ సమావేశముజరిగెను. వారేమాలోచించిరో తెలియదు. కానిఆటుతర్వాత ప్రజాపక్షము (పీపిల్సుపార్టీ)యొక్క సమావేశములో సారజోగ్లుగారు తుర్కీయొక్క విదేశవ్యవహారములనుగురించి ఉపన్యసించిరి, సంతోషమును వెల్లడించిరి. పేపనుగారు జర్మనీఆర్థికవిషయాలలో తుర్కీనుండి ఇప్పటికంటెఎక్కువ సహకారమునుకోరుచున్నదని తుర్కీఅధ్యక్షునికి ఇచ్చినసందేశములో తెలియబరచినట్లు కొందరు చెప్పుచున్నారు.

మొల్దావియాలోఇపుడు ౧౫ డివిజనుల జర్మను సేనలున్నవట ఆక్కడనుప్రాంతముపైకి జర్మనుసేనలుదండెత్తుటకు పూర్వముఅక్కడఉండిన జర్మనుసేనలకంటె ఇపుడున్నవి ఎక్కువయట, డాన్యూబునది దిగువభాగంలో జర్మనులు సముద్రానికిపోవ చిన్నపడవలను ఉంచియున్నారు. ఇదంతయు ఉక్రెయిన్ పైదండెత్తుటకోలేక రష్యానుండిఎక్కువసౌకర్యములనుపొందుటకై బెదరించుటకోయని కొందరు తలచుచున్నారు.

జర్మనులు లెమ్నాస్ లెస్బాస్, చియాస్ అను గ్రీకుదీవులనాక్రమించుటవల్ల తుర్కీలోని ఇస్తాన్బుల్ కును స్మర్నాకును మధ్యరాకపోకలసంబంధముతెగిపోవునని భయముకలుగుచున్నది. ఇటువంటిస్థితిలో అమెరికావారిపడవలు ప్రతివాలుగురోజులకొకసారి సూయెజాకాలువలోకి చేరుచున్నవి ఇందువల్ల అలెగ్జాండ్రియాయొక్క ప్రాముఖ్యముఎక్కువయైనది. అలెగ్జాండ్రియా ఇకమీదట బ్రిటిషువ్యాపారానికి తుర్కీలోముఖ్యమైనరేవుగానుండగలదు. అందువల్లఅక్కడి పోర్టును నవీనపద్ధతులప్రకారము ఉండునట్లు చేయబడుచున్నది.

ఎఱ్ఱసముద్రపుమార్గమున అమెరికావారు బ్రిటిషువారికి యుద్ధసహాయసామగ్రినిపంపుటకు నిర్ణయించగానే, మే౧౨వతేదినాటి జర్మనురేడియోలో ఒకహెచ్చరికచేయబడినది. ఎఱ్ఱసముద్రముయొక్క ఉత్తరభాగము, సూయెజాసింధుశాఖ, అకాబాసింధుశాఖ ఈప్రదేశములలో ఓడలు సంచరించరాదని హెచ్చరికలోనున్నది. ఎందువల్లననగా ఈప్రదేశములలో జర్మనులుసుందుగనుఅనుంచినారట. సౌదిఅరేబియాకుచెందిన సముద్రంమాత్రము ఈహెచ్చరికనుండి మినహాయించబడినది. నిషిద్ధప్రదేశముగుండా పుణ్యక్షేత్రాలకు పోవుయాత్రికులనుతీసికొనిపోవుఓడలను పోనిచ్చువిషయమై జర్మనులాలోచించుచున్నారట

జర్మనులు రష్యాపైకిదూకవలెనని యున్నట్లు కొందరుఊహించితే, జపానులో సైనికశాఖయొక్కపత్రికయగు 'కోకుమిన్' యొక్క మే౧౨వతేదినాటిసంపాదకీయములో ఇందుకువ్యతిరేకమైనఊహయున్నది. అదియేమనగా, రష్యావారు జర్మనీకి ఇప్పటికంటె ఎక్కువ సరకు పంపించుటకిష్టపడి జర్మనీఆసియాలో రష్యావారిష్టముపచ్చినట్లు చేసికొనుటకు సమ్మతించుచో జపాను చేతులుముడుచుకొని ఊరకచూచుచుండజాలదు-అని హెచ్చరికచేయబడినది.

ఇవాన్నవ్గా జర్మనీలో రష్యారాయబారిగానుండిన డెకానోసోవ్ గారు ఇటీవల రష్యాకుపోయియుండిరి. అక్కడ౧౫రోజులుగడపి తిరిగి ఇప్పుడిప్పుడే జర్మనీకి పోయినారు.

మే౧౨వతేదిన తుర్కీశాసనసభవారు తుర్కీని శత్రుభయమునుండి కాపాడుటకు వలయుఖర్చులకుగాను ౧౨కోట్ల౫౦లక్షలపౌనులను మంజూరిచేసినారట.

### ఫ్రాన్సు జర్మనీషరతుల కంగీకరించుట

జర్మనీవారు ఈ యుద్ధంలో ఫ్రాన్సును తమపక్షానచేరి బ్రిటనుతోపోరాడుటకు ఎంతోఒత్తిడి చేయుచున్నారు. ఇపుడు ఫ్రాన్సులో జర్మను లాక్రమించినభాగంలో పరిపాలన చేయుచున్న ఫ్రెంచిమంత్రివర్గంలో ఇదివరలోలవల్ గారు ఉపప్రధానిగానుండి జర్మనులకనుకూలములైన విధానమును ఫ్రాన్సుఅవలంబించునట్లుచేయుటకై ఎంతోదూరముయత్నించిరి కానితుదకు లవల్ గారు మంత్రివర్గంలోనుండే లేచిపోవలసివచ్చెను. అటుతర్వాత అడ్మిరల్ డార్లాన్ గారు ఉపప్రధాని అయిరి. వీరును జర్మనీషరతులకు ఫ్రాన్సుఒప్పుకొనవలెననెడిపక్షపువారుగానే ఉన్నట్లు కనిపించుచున్నది ౧౫రోజులనుండి వీరుఆక్రమించబడిన ఫ్రాన్సుభాగంలోఉండే జర్మనుఅధికారుల చుట్టును పలుమారులుతిరిగి జర్మనుఫ్రాన్సుకివ్వదలచిన సౌకర్యములను, దానికి ప్రతిఫలంగా జర్మనులు కోరినషరతులను తెలిసికొని తిరిగివిషీకి వచ్చిరి అక్కడపెటెయినుకు జర్మను అధికారులతో తానుజరిపియుండిన రాయబార ఫలితములనన్నిటిని నివేదించిరి పిమ్మట మే౧౨వతేదీ ఉదయము ఫ్రెంచిమంత్రివర్గముసమావేశమై జర్మను షరతులను ఆమోదించెను ఫ్రాన్సులో జర్మనుసేనలుంచినందుకై ఇపుడుజర్మనులు ఫ్రాన్సునుండి రోజుగకి ౨౦కోట్లఫ్రాంకులను ఖర్చుక్రిందతీసికొనుచున్నారు ఇకమీదటఈఖర్చును ౧౫కోట్లఫ్రాంకులకుతగ్గించుటకు జర్మనులిపుడు ఒప్పుకొన్నారు ఫ్రాన్సులో జర్మను లాక్రమించియున్న భాగానికిని ఆక్రమించనిభాగానికిని మధ్యపరిహద్దునందు ఇదివరలో జర్మనుతేర్పరచియుండిన కొన్నినిర్బంధములను ఇపుడు సవరణచేయుటకుకూడ జర్మనులంగీకరించినారు, మరిఈసౌకర్యములను ఫ్రాన్సుకిచ్చినందుకు ప్రతిఫలంగా జర్మనీకి ఫ్రాన్సు ఏమియివ్వవలసివచ్చెనో అదితెలుపబడలేదు. ఆసియాలోను ఆఫ్రికాలోను ఫ్రెంచివారు జర్మనుల ప్రయత్నాలకు తోడ్పడవలసినదని జర్మను అధికారులు ఫ్రెంచివారిని కోరియుండిరి, ఈకోరికను ఫ్రెంచివారుఅంగీకరించినారోలేదో తెలియదు. సిరియాలోనివిమానాశ్రయాలను జర్మనులుఉపయోగించుకొనిరనే సమాచారమునుబట్టిచూడగా జర్మనులకుఈసౌకర్యము పైనచెప్పిన ఒడంబడికవలననే జర్మనీకి ఫ్రాన్సునుండిలభించియుండునని పించుచున్నది.

మే౧౨వతేదిరాత్రి పెటెయినుగారుఒకబ్రాడ్ కాస్టుఉపన్యాసంలో ఫ్రెంచిప్రజలకు జర్మనుప్రభుత్వంతోఇంతవరకు కుదిరినఒడంబడిక ఫ్రాన్సుభవిష్యత్తుకులాభకరమైనదనిచెప్పుచు, జర్మనుప్రభుత్వములో రాయబారము అనుపూర్తిచేసినచో ఫ్రాన్సుయూరపీయరాజ్యముగా నిలచియుండ సామ్రాజ్యమును అనుభవించుచుండగలదనిరి.

త్వరలో జర్మను విదేశాంగమంత్రి రిబ్బెన్ ట్రాఫ్ గారు పారిసుకువచ్చిఫ్రాన్సునవ్యయూరపువ్యవస్థలో ఫ్రాన్సుకూడచేరుటకు సమ్మతించినట్లు ప్రకటించెదరట.

### హిట్లరుయొక్క ముందుఎత్తులు

హిట్లరు ఇంకఒకనెలలోగా స్పెయినుమీదికి దండయాత్రవెడలి జిబ్రాల్టరును ముట్టడిచేసిఅట్లాంటిక్ సముద్రంలోస్పెయినుయొక్కయు పోర్చుగల్లుయొక్కయురేవులను పట్టుకొనగలడని సైనికవ్యవహారాలపరిచయముగల రూటరుప్రతినిధితోచున్నాడట. హిట్లరుసేనలు తుర్కీపైకిని, ఇపుడు గ్రీకుప్రభుత్వమున్న క్రీటుమీదికిని దూకిపోవునట. రష్యాను ౧౫౦ డివిజనులసేనలతో జర్మనులు బెదరించెదరట. లిబియాలో జర్మనుసేనలనుఎక్కువచేసి ఈజిప్టుపైదాడిని తీవ్రముగాసాగించెదరట.

### ఫ్రాన్సుగుండా జర్మనుటార్పెడోబోట్లు

జర్మనీవారు ఫ్రాన్సులో నదులగుండా మధ్యధరాసముద్రంలోకి టార్పెడోబోటులను పంపుచున్నారట.

### ఫ్రెంచివారు జర్మనీకిచ్చిన సౌకర్యాలు

జర్మను లాక్రమించిన ఫ్రాన్సులోజర్మనుసేనలుంచినందుకు పట్టుఖర్చుతగ్గించినందుకు ఫ్రాన్సునుండి జర్మనీఆశించిన సౌకర్యాలీక్రిందవిధముగానున్నవి. స్పెయినుతోగాని, జిబ్రాల్టరుతోగాని జర్మనులుచేయవలసివచ్చే యుద్ధానికై ఫ్రాన్సులోగుండా జర్మనుసేనలను, సామగ్రులనుపంపుటకు ఫ్రెంచివారుసౌకర్యములుకలిగించవలెను. ఉత్తరఆఫ్రికాకు జర్మనుసేనలను సామగ్రిని మార్సెల్సు రేవు మీదుగా పంపించవలసియున్నది ఆరేవును జర్మనులుఇప్పటికంటెఎక్కువగా ఉపయోగించుకొనుటకు అధికారమీయవలెను. ఫ్రెంచివారిమొరాకోలో జర్మనువిమానాలకు సౌకర్యములను హెచ్చించవలెను, నాల్గవఅంశమేమనగా ఫ్రెంచివారివర్తకనావలపై జర్మనులకుఇప్పటికంటె ఎక్కువఅధికారమునీయవలెను, ఈరాఖుమీదికిపోవుటకును, సూయెజాప్రాంతముమీదికిపోవుటకును సిరియాలోని విమానాశ్రయములను ఉపయోగించుకొనుటకు జర్మనులకుఅనుమతినీయవలెను. జర్మనుటాంకులకు తిరిగిఆయుధములను అమర్చుటకు ఫ్రాన్సులోని పరిశ్రమలుసహాయముచేయవలెను. జర్మనుల జలాంతర్గాములను రిపేరీచేయుటకై ఫ్రాన్సుతోడ్పడవలెను. జర్మనీలోజలాంతర్గాములను రిపేరీచేయుచోట్లు బ్రిటిషువిమానాలదాడులచే పాడుచేయబడినందువల్ల ఈక్రొత్తఏర్పాటుఅవసరమైనది

ఈవిధంగా ఫ్రాన్సు జర్మనీకిసంపూర్ణసహకారంచేయుటకు అంగీకరించినందువల్ల ఆఫ్రికాలో ఫ్రెంచివారిసామంతరాజ్యములును, వాటిఅట్లాంటిక్ సముద్రతీరములును జర్మనులకుయివ్వబడినట్లగును కాబట్టి ఇదిఅమెరికాకునష్టకరమని రూజ్వెల్టుగారు మే౧౨వతేదిన ఒకప్రకటనలో తెల్పినారు.

## ఇప్పుడు దొరికినాడు

గతసంవత్సరం హిందూ ముస్లిం కొట్లాటలో హైదరాబాదునల్లగుట్టలో జరిగినఅల్లరులసందర్భములో పారిపోయి దాగియుండిన యూసుఫ్ అనువాడు ఇటీవలపట్టుపడినాడు.

## ఖమ్మం నిందితులు

ఖమ్మంతాలూకావారైన పలువురునిందితులనుకొందరును...సంవత్సరాలకఠినశిక్షవిధించబడినారు, వారువరంగల్ సెషన్ కోర్టులో అప్పీలు చేసినారు,

### మైసూరు దివాను పదవినుండి మీర్జాఇస్మాయిల్ గారి విరమణము

మైసూరు దివానుపదవినుండి సర్ మీర్జాఇస్మాయిల్ గారు మేనెలఖరున విరమించుకొనుచున్నారు వీరికిబదులు మైసూరుమహారాజా కృష్ణరాజఒడయార్ గారి కాలమంతయు దివానుగానుండిన ఇప్పుడు జయచామరాజఒడయార్ గారు సింహాసనమధిష్ఠించిన కొద్దికాలానికే విరమించుకొనబోవుచున్నారను వార్తవచ్చుట ఆశ్చర్యకరముగానున్నది.

...అంతటపశువ్రతినును.

౩ వేళలయందు పశువులు తినుగడ్డిలోకలుపు కొంచెదరుపశువులు మేయుబీడుభూములలో పాడిజిల్లులకు పరికొందరుచర్మమునుచీ ...గాయమునందు విషమునుపూయుదురు. లే దాఅశనమందు గాని, యోనియందు గానివిషపదా రమెక్కించుదురు.

మరూచిపడిచనిపోయిన పశువుయొక్క తలను భూమిలోపాతిపెట్టి అదికుళ్లినతరువాత దానితో ఒకఇంజక్షనునూదినిదించి కుళ్లినీరునూదికిపట్టించి పశువులాలిటూదితో ఇతరజంతువులనుకొంచెము రక్తముకారునట్లుచేయుదురు. వెంటనేఆవిషమె క్కి పశువు చనిపోవును.

జిల్లేడుపాలను ఒకచిప్పలోనికిఒడిచి మూరె డుపొడుగును, ఒకఅంగుళమువెడల్పునగలిగి క్రర ల్లకొనవగుడ్డనుచుట్టి మూత్రమువిడుచు ప్రేగుల లోనికిగుచ్చి లోపలఆగుడ్డనుంచిపుల్లను నెమ్మది గాబయటకులాగుదురు. ఈమందుబహువేడి కుగు టకలన వెంటనేపేగులువాచి బాధపడిచచ్చి పోవును.

విరోధముగానుండువారు గాని, మాదిగలు గా లుగలుగును. ఎరుగియుధుముగా కయ్యును. వాం తిచేయుటకుప్రయత్నించును కడుపునొప్పికలుగు ను, తరచుగాలేచుచు పడుకొనుచుండును. కడు పుబ్బును, పిమ్మటదుర్గంధముతోగూడినవిరేచనము లగుచుండును. అవిరేచనములలో రక్తంజీరకూడ యుండును.

అసనములో పెట్టినయెడల అసనముఎరబడిచా లబాధపడును. కడపటిఅవస్థలో దైన్యముతో చూ చును కంటిపాపలుపెద్దవై చాలాఆయాసములిగి పక్షపాతముచేనిలుకక్రిందబడి చనిపోవును.

చికిత్సలు

పదిలేక ఇరువది కోడిగ్రుడ్లను ఒక సేరున్నర చి క్కనిజావలోగాని పాలలోగానిక లిపిమూడువా లుగగంటలకొకపర్యాయం త్రాగించవలెను. లేక వెలగబంకనీరుగాని, అన్నపుగంజినీరుగాని త్రాగించవ లెను, లేకపచ్చిఅవిసెనూనిగాని మున్నపుతేటగా ని, ఘాటుసారాయిగాని త్రాగించవలెను. లేక సొంటిఅతు, నల్లమిరియాలపొడిగతు, సారాయి గలెతు, జాగ సేరుకలిపిరెండుమూడుపర్యాయము లు త్రాగించవలెను.

(ఆంధ్ర ప్రభ)

---

...శ్యకతనుగూర్చియు వానిప్రయోజనములనుగూర్చి యు ముచ్చటించిరి-

సాయంత్రం ౫గంటలకు ఈయుత్సవముల క రుదెంచినసభ్యుల ఛాయాపటములుతీయబడినవి- ౬గంటలకు ఈసమితి చతుర్థవార్షికసమావేశము చిలుకూరి శ్రీరాములుకవిగారి యధ్యక్షతక్రింద బ్రహ్మశ్రీ పుచ్చా వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి గారి దైవప్రార్థనరూపకమైన తరంగకాలక్షేప ముతో ప్రారంభింపబడినది- శ్రీయుత బెల్లం కొండ విశ్వనాధరావుగారు ... సాహిత్య ప్ర శంసారూపక పద్యములనుజదివిరి-తరువాత శ్రీ మాన్ ఆసూరి మరింగంటి రామానుజాచార్యులు గారు తామురచించిన భక్తిరసప్రధానమైన వేణు గోపాలశతకమునుజదివిరి- ఇంద్రకంటి వెంకటర మణమూర్తిగారు ప్రస్తుతమురచించుచున్న ఒక గ్రంథమునందలి డాంబికులయొక్క ఆధునికభా షాసేవాపద్ధతులను సహజముగా ప్రస్తుతము లో కము కవసరమైన భాషాసేవకులకుండవలసిన లక్ష ణములనువర్ణించు కొన్నిపద్యములు జదివి శ్రోతల నానందింపజేసి ప్రబోధించిరి-అనంతరము పుచ్చా వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు సంగీతసాహి త్యముల మాధుర్యార్థభావములను వెల్లడించుటకు సాహిత్యపరులకు సంగీతము సంగీతపరులకుసాహి త్యము అత్యవసరముగానుండవలసిన ప్రాముఖ్యత ను వెల్లడించుచు ముచ్చటించిరి-

పిమ్మట సమితియొక్క అధ్యక్షులగు బెల్లం కొండ విశ్వనాథరావుగారు సభ్యులనుద్దేశించి కార్యదర్శినుండి తమకుజరిగిన ఉత్తరప్రత్యుత్తర ములను తదితరసభ్యులనుండి రాబడిన ఉత్తరప్ర త్యుత్తరములనుజదివిరి- ఏకారణముచేతనో కార్య దర్శియైన కో. వెం రా. ల. నా శర్మగారు తమ విధి యైన వార్షికనివేదికను సమర్పించకపోవుట అధ మపక్షము తామైనను హాజరు కాకపోవుటనుగూ ర్చిముచ్చటించిరి. ఈసమావేశములకు రాజాలక పోయిన శ్రీయుత ? ట్టుపర్తి సుబ్బారావుగారు (హైకోర్టువకీలు) బ్ర. శ్రీ హరిరామలింగశాస్త్రి గారు (శతావధాని) శే. హనుమంతరావుగారు బ్ర. శ్రీ ములుగు శివానందశాస్త్రిగారు పూజారి మల్లయ్యగారువగైరా పెద్దలు సందేశములుపంప గా అధ్యక్షులు చదివివినిపించిరి

అనంతరం సభాధ్యక్షులు విశ్వనాధరావుగారి పద్యములు గంభీరార్థభావములతో నిండియున్న వనియు ఆచార్యులుగారిశతకము రసవత్తరముగా కుంటుపడని కవితాధోరణితో నలరారుచున్నద నియు ఇకను వారుకృషిచేసి గొప్పగ్రంధములు వ్రాయవలయుననియు మూర్తిగారురచించుచున్న గ్రంథమందలిపద్యములలో భాషాసేవకుల కుండవ లసినలక్షణముల వర్ణించుపద్యములు చక్కగానున్న వనియు తెలవిచ్చుచూ నీయాంధ్రవాఙ్మయసేవా సమితి నాశీర్వదించుపద్యములుచదివి సభముగింప జేసిరి. యీ యుత్సవములకు ఖూరుగుంపాడుకు

---

...ని వాగ్దత్తము చేసినందున మిగతాకిరాణం మని యాతలనుప్పలకొట్ల యజమానులవద్దకువెళ్లి చెప్పు డముతోనే అన్ని దుకాణములు మూయబడెను.

సాయంత్రం ౧౦.ఠలకు మరా. శ్రీ చందా కాంతయ్యగారు (మద్యపాననిరోధక సంఘము) వారి ౧౫౦మందివాలంటీర్లకు ఉపాహారవిందు జరి పి, కద్దరుదుస్తులుయిచ్చిరి. వీరినిప్రజలు బహువిధ ములుగా ప్రశంసించిరి, సాయంత్రం ౧౦ ౬లకు శ్రీరామలింగేశ్వరస్వామి ఆలయమున షుమారు ౨-౩వందలకుపైగా వుద్యోగులు సమావేశమయి ఈక్రిందివిధముగా తీర్మానమును వర్తక సంఘము వారికి తెలియజెప్పుటకు యేకగ్రీవముగా తీర్మా నించిరి.

(౧) ప్రతిఆదివారం పజలకుయిబ్బందికాకుం డ పత్తిసరకులకొట్టొకటే తెరచి, అమ్ముటకు యేర్పాటు, తద్వారారాబడినబ్బు సభవారి అను మతిప్రకారం ఉపయోగించేదానికి నిర్ణయించుట.

---

సమీపగ్రామములైన తిమ్మాపేట అమరవరం తొం డిపాక నెల్లిపాక విరివెండి పాల్వంచమొదలగు గ్రామాలనుండి పలువురుసభ్యులు వచ్చియుండిరి.

పిమ్మట బెలంకొండ విశ్వనాధరావుగార్ యొ ధ్యక్షతక్రింద పమి సర్వసభ్యసమావేశము జరిగి కొన్నితీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింప బడినవి.

---

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర వైశాఖ బ॥ ౯

సోమవారము


## ప్రజా సేవ.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే
మాఫలేషుకదాచన.
—భగవద్గీత—

ఇటీవలనే వెలువడిన హైద్రాబాదు రాష్ట్రీ గ్రామపునర్నిర్మాణ శాఖాని వేదికలో ఇట్లువ్రాసినారు.

In his present frame of mind the villager is least inclined to incur any monetary burden no matter how small, if he could manage to avoid it.

"ఇప్పటి గ్రామజనుల బుద్ధిని బట్టి చూస్తే వారికితప్పించుకొనే వీలుకలిగితే చాలు, ఏమాత్రపు కొద్దిభారమైనాసరే దులుపుకొని పొయ్యేవాలకం కనబడుతుంది." దీనినిగురించి మేము దివరకే మాఅభిప్రాయమును వెల్లడించి నను గతవారము మాపత్రికలో మధిర తాలూకాలో గుండిపూడి గ్రామవాసులగు కాళ్లూరిరామకిషన్ రావుగారును ఉమామహేశ్వర రావుగారును హరిజన ఛాత్రగృహమునకై దానముచేసిన సందర్భములో మరొకమారు పైవాక్యము మాకు జ్ఞాపకమునకువచ్చెను. హైద్రాబాదు రాష్ట్రీములో ప్రజాహిత సంస్థలకు ప్రజలు సహాకారము చూపరనియు వాటియందు వారికి శ్రద్ధలేదనియు చెప్పుచుందురు. ఈ లోపము కొంతవరకు సత్యముగా కనబడుచుండినను దానికి కారణము ప్రధానముగా ప్రజలేనా లేక ఇతరులుకూడా భాగస్వాములైయున్నారా అనునంశమును ఆలోచించుటలేదు.

ఆమాటకువస్తే నిజాంరాష్ట్రీములోనే దాతృత్వమున్నది. అందులోను తెలంగానా ఆంధ్రులలోనే యెక్కువగా యున్నది. అనిగట్టిగాతప్పు పట్టనిరీతిగా చెప్పగలము. అయితే మనవారి దానము పాత్రాపాత్రములెరిగినదా అనిన ఆమాటమాత్రము గట్టిగా చెప్పజాలము. మనము యుగసంధిలో ఉన్నాము. పాతభావాలు మారిపోవుచున్నవి. కొత్త భావాలు ప్రవేశించుచున్నవి. ఆర్యులకు ఇతర మతాలతో ఇతరదేశాలతో ఇతరభావాలతో సంబంధమేర్పడియున్నది. తదనుగుణ్యముగా మనము దేశకాలపాత్రతలను అనుసరించి మనభావాలను సర్దుపాటు చేసుకొనవలసి యుండును. ఈ కారణముచేత పాత్రాపాత్ర విచక్షణ మనలో ఎక్కువగాక నబడకపోవచ్చును.

హైద్రాబాదు రాష్ట్రీవాసులు బయటిప్రదేశాలకువెళ్లి ద్రవ్యమును ప్రోగుచేసుకొని వచ్చువాడుకలేనివారై యున్నారు. తమ వద్దకెవరువచ్చినను తమ శక్తి కొలది లేదనకుండా సహాయముచేసి పంపుచుందురు. అటుపూనా సేవాసదనము ఇటు గుంటూరు శారదానికేతనము అటు ఆర్యసమాజము ఇటు త్రివేంగ విద్యాపీఠము, అటు బొంబాయిఆంధ్రులు, ఇటు మద్రాసు ఆంధ్రులు, గ్రంథమాలలవారు ప్రజాసంస్థలవారు, ఎవరంటేవారు రాష్ట్రీములోకివచ్చి సంతుష్టులై మంచి సహాయమును పొంది పోవుచున్నారు.

ఇక హైద్రాబాదు రాష్ట్రీములోని వారు మాత్రము లాభముపొందలేదా! ఆదిహిందూ సోషల్ సర్వీస్‌లీగు బిల్డింగు ౫౦ వేలరూప్లుసిద్ధమయ్యెను. ప్రజాద్రవ్యముచే! దానిపరిణామమో? అదిప్పుడు ఎవరి యిల్లుగానో ఏర్పడినట్లున్నది!! కాని ద్రవ్యమిచ్చిన దాతలలో వేలిచ్చినవారైనను దానిని విచారించుకొనుచున్నారా? మనవారునిష్కామకర్ములు, కర్మసన్యాసులు.

" సర్వకర్మఫలత్యాగం
సన్యాసంకవయోవిదుః "

ఎన్ని యోకులసంస్థలు ప్రజాద్రవ్యముచేత కాక మరెవ్వరిద్రవ్యముచేత నడుచుచున్నవి. రెడ్డిఛాత్రగృహము, కమ్మఛాత్రగృహము.నగరకులఛాత్రగృహము, ఇవన్నియు ఎట్లేర్పడెను? ప్రజాద్రవ్యముచేతనే! ఆంధ్రబాలికోన్నత పాఠశాలను ఎవ్వరుకట్టించిరి? ప్రజలే! తమద్రవ్యముచేతనే!! కృష్ణదేవరాయాంధ్రగ్రంథాలయాలవంటిగ్రంథాలయాల నెవ్వరుకట్టించిరి? అంతయుప్రజాద్రవ్యముచేత నేసిద్ధమయ్యెను! వివేకవర్ధని, సికింద్రాబాదులోని పరోపకారిణీబాలికాపాఠశాల, హైద్రాబాదులోని ఖాస్గీపాఠశాలలు, జిల్లాలలోని గ్రంథాలయాలు, ప్రజాపాఠశాలలు, ఇవన్నింటిని ప్రజలే పోషించుచున్నారు. ఎన్ని యోగ్రంథమాలలకుపోషకులుగా, రాజపోషకులుగా అభిమానులుగా ఎవ్వరేర్పడుచున్నారు? ప్రజలే! ప్రతి సంవత్సరము వివిధప్రాంతాలలో జరుగు ప్రజాసంస్థలసభలకును మహాసభలకును ద్రవ్యసహాయము ప్రజలేకదాచేయునది. ఒక్కఆంధ్ర మహాసభజరిగితే ఏటేట ఏడెనిమిదివేల రూపాయాలను మనవారేకదాభరించుకొనునది. కొన్నిప్రాంతాలలోనుండి కొందరు పెద్దమనుష్యులు బయలుదేరిఅల్లిబొల్లమాటలుచెప్పిగ్రంథమాలలనో అట్టివాటినో స్థాపించుచున్నామని చెప్పిఎన్ని మారులు ఈ రాష్ట్రీప్రజనుండి ద్రవ్యము తీసుకొనిపోయి వారికి గ్రంథాలనేచూపించక పోయిరి కదా! అట్టి అమాయకులు మనవారు. ఎవ్వరైనా పెద్దమనిషి వచ్చి సిఫారసు చేయవలెను. అంతమాత్రముతో మనవారు ఔదార్యమును చూపుదురు. చూపినతర్వాత మరల దానిగతి యేమైనదని విచారించుకొనైనను విచారించుకోరు.

మనసోదరులకు మతవిశ్వాసముమెండుగాఉన్నది. అందుచేత యజ్ఞయాగాదులకని కుండలమండితులు రుద్రాక్షలక్షితులు, బ్రహ్మశ్రీలు, వేదమూర్తులు, ప్రత్యక్షమైన వెంటనే కిమ్మనక కమ్మనక ఉదారముగా ద్రవ్యసహాయము చేయుదురు తామకోటిశివకోటివారు,సప్తాహాలవారు, జపాలవారు, బిల్వార్చకులు,పట్టాభిషేకాలవారు, గురుమూర్తులు, అచలగురులు, సాధులు, యోగులు ఇంకెందరో మాకు తెలియనివారు — ఎవ్వరు వచ్చినా సరే లేదుపో అనుపాపాన పోరు! ఇంతో అంతో ఇచ్చుకొని దండముపెట్టి సెలవిచ్చి సాగనంపుచుందురు.

కావున మనవారిలో ఔదార్యము లేదనికాని ప్రజోపయుక్తములగుకార్యాలకుఇచ్చుటలేదనికానినిందించుటకు ఎవ్వరికినిఅధికారములేదు. పాత్రాపాత్రదానములను గురించి విచక్షణకలుగునట్లు చేయుట ప్రజా నాయకుల కార్యమైయున్నది. ఈ కాలములో విద్యాసంస్థలకు రాత్రిపాఠశాలలకు, గ్రంథాలయాలకు గ్రంథమాలలకు, వసతిగృహాలకు, హరిజనోద్ధరణకు, స్త్రీలశరణాలయాలకు విరివిగాసహాయముచేయుట అవసరమైయున్నది. ఉదారముగా సహాయముచేయు దాతులయెడ ప్రజాహితసంస్థలునువాటిని నడుపువారునుతమకృతజ్ఞతను తెలుపుచు వారికీర్తిని అంతటను ప్రసరింపజేయవలసి యుండును. ఇటీవల గద్వాలసంస్థానములో పుల్లయ్యఅనువారు కొన్నివేల ద్రవ్యమును విద్యాసంస్థలకిచ్చినది మాపాఠకులకు జ్ఞాపకముండవచ్చును. గతవారమే మధిర తాలూకా జమీందారులైన కాళ్లూరి వంశము వారు తమ తండ్రిగారి శ్రాద్ధదివసమునాడు హరిజన వసతిగృహానికి ౧౦౦౦ రూ॥ దానముచేసిరని వింటిమి. మృతులకు ఇంత కన్నమించిన స్మారకము మరొకటియుండదు. శ్రాద్ధకర్మ సమయములలో హిందువులు వ్యయముచేసినంత మరేమతము వారును చేయరని చెప్పవచ్చును. శ్రాద్ధములో ఉదారముగా దక్షిణలీయకున్న షోడశదానాలు గోఛత్ర పాదరక్షలయుక్తముగా చేయకున్న మృతాత్మవైతరణీనదినిదాట దనిన్నీ మనవారివిశ్వాసము. తుష్టిపూర్తిగా తిని, తిన్నంతవిస్తరిచుట్టూపారవేసి దక్షిణకైకుస్తీలవరకు వచ్చి తుదకు "పినిశ్రాద్ధముపిడేమియిచ్చినాడు" అనినాలుగుబూతులు ఎదుటనో దాపుననో తిట్టిపోవువారికిచ్చుటలో సమంజసత్వము కానరాదు. కృతజ్ఞులై యుపకారమును ఎన్నడును మరువక మనసారదీవించి ప్రార్థించు వారికిచ్చు దానము దాతకుశ్రేయస్సును చేకూర్చును. హరిజనులు ఉపకారమును ఎన్నటికిని మరువనివారు. అత్యంతముగా ఆర్హులైన వారు. అట్టిజాతికి "శ్రద్ధ" తోకూడిన వారై కాళ్లూరివారు దానముచేసినందులకు వారుధన్యులు. రాష్ట్రీములోని ధనికులందరు ఇట్టికార్యాలకే తమదానమును వినియోగింతురు గాక.

---

## ఆర్యసమాజ కార్యదర్శికి —౧ సంవత్సరం శిక్ష

మాదన్నపేట ఆర్యసమాజ కార్యదర్శిఅయిన నాగభూషణం అనేవారు ఒకసభలో ఒకపాట పాడినారు. ఆపాటలో మతకలహాలకుఅవకాశమిచ్చే భావాలుండినవట. అందుపైఅతన్ని హైద్రాబాదు సంరక్షణశాసనం 3ెనమాత్రంప్రకారం పట్టుకొని కోర్టులోనిలదీసినారు, విచారణజరిగింది నిందితుడేఅని నిర్ణయమైంది అయితేనిందితునివయస్సుపై న్యాయాధికారికి జాలికలిగింది. ఒకసంవత్సరము జెయిలులో కఠినశిక్షను అనుభవించితేచాలునులేఅని శిక్షవేసి పంపినారు.

---

సానుభూతిసభ

హైదరాబాదు[దక్కన్] తేదీ — నిజాంరాష్ట్రీ ఆయుర్వేద కళాశాలాధ్యక్షులైన పండిత వే॥రి॥ రామానుజస్వామి గారు ౨౧ ఖుర్దాదునాడు మ. వరసింగ రావుగారి ఆస్పత్రిలో హఠాత్ బకేశేకంపాహెబ్ గారి మరణమునకై తమసానుభూతి తెలుపుటకై హైద్రాబాదు నగరములో బ్రహ్మసమాజ మందిరములో సానుభూతిసభచేసి తీర్మానముగావించిరి

---

## ఇరాఖును గురించి

## మ. ఘ. వ. నిజాంగారి ఫర్మానా

మ.ఘ.వ. నిజాంప్రభువుగారిట్లు సెలవిచ్చినారు.—

ఇరాఖులో పొటమరించిన అంశాలనుబట్టి నా రాష్ట్రీములోని పలువురుముసల్మానులకు లేక హిందూస్థానములో అనగా ఇతర ప్రాంతాలలోని ముసల్మానులకును అపోహలుకలుగవచ్చును. బ్రిటిషువారు విధిలేక అవలంబించవలసిన విధానముల యెడ ముసల్మానులందరిలోని అనుమానాలు దూరమగుటకై సంక్షిప్తప్రకటన చేయుచున్నాను.

ఇరాఖువిషయములో అభిమానము కలవారందరికిని నాకట్టినమ్మకమును వెల్లడిచేయుటయేమనగా ఇంగ్లీషువారు ఇరాఖుకు ఒకరాజ్యస్వయాధమునిచ్చినారు, వారుదానితో మిత్రత్వమునే కోరుతారు. వారుకోరునదేమనగా వారి స్నేహితులైన ఈజిప్టు తుర్కీదేశాలకుసంబంధముండుటకై రాకపోకలకు అవకాశముండవలెను. ౧౯౩౦ లోనే ఈ షరతులు కావించుకొనబడియుండెను. ఇంగ్లీషువారిప్పటికి పూర్వస్నేహాన్ని దృఢంగా స్థిరపరచుటకే ఇష్టమున్నది.

ఇరాఖులో నిప్పుడేర్పడిన కష్టాలకంతకును రషీదలీయొక్క ద్రోహమే కారణము. అతడు జర్మను కుట్రచేయువారితో చేరిపోయినాడు. ఇతడు బలవంతముగా ఇరాఖు ప్రభుత్వాన్ని ఆక్రమించుకొన్నాడు. ఇదివరలో కొంతకల్లోలము కలిగించి తనదేశమునుండి పారిపోయియుండెను. ఇతడు మర్యాదస్థులైనవారై కొందరి కుట్రదారులను జతచేసుకొని మనసామ్రాజ్యానికి ఇరాఖుప్రభుత్వానికిజరిగిన ఏర్పాట్లకు విరుద్ధముగా వర్తించుకొన్నాడు అత్యధికమైన ద్రోహముచే ఇతడు హాబ్బానియా విమానాశ్రయాన్ని వశపరచుకొన్నాడు.

తుదకు విధాయకముగా మహా పాశర్ ఇంగ్లీషుసైన్యమున్ను హిందూస్థానీసైన్యమున్ను కలిసముగావారిపైబడి వారిబలాన్ని... వారిట్లుచేయుట వారిషరతులనుపాలించుట యొకటి. అదియునుగాక ఈజిప్టును హిందూస్థానాన్ని రక్షించుటకును అదిచాలా అవసరం

హిందూస్థానమందలి ముసల్మానులను నేను బలపూర్వకముగా కోరేదేమనగా తామందరును వాతోపాటిగా పిగలీవి వానితో చేరినవారిని అసహ్యదృష్టితో చూడవలెను. మనముతాజ్జ కారము మనగుఇచ్చినమాట తప్పకూడదు, అతడు తప్పినాడు.

---

## యుద్ధ మొహర్లు

హైద్రాబాదు యుద్ధసహాయక సమితివారింతలో హైద్రాబాదు యుద్ధమొహర్లను జారీచేయనున్నారు. యుద్ధం తీవ్రరూపముదాల్చుచున్నది. అందుచేత రాష్ట్రీంలోనిఅందరును ఎంతటివారైనాసరే చిన్నచిన్న చందాలుకూడా ఇయ్యవలెను.

గతయుద్ధంలో ఈమొహరు వాడుకలోకి వచ్చియుండెను. గానిపై చార్మినారు ముద్రించియుండెను ఇప్పటిమొహరుపై చార్మినారుమీదుగా రెండువిమానాలు ఎగిరినట్లు ముద్రింతురు. మొహరుపై "విశ్వాసపాత్రమిత్రుడు" అను కవ్వతలిరుదును ముద్రింతురు. మొహరు క్రయం ఒక ఆణా, అరమేనాడు ఇవి ప్రచారములోకి పంపబడును

---

## దర్జాదొంగలు

బంగారుఖడ్డీలను మార్పించి సీసంఖడ్డీలను పెట్టిన దర్జాదొంగలకేసు హైద్రాబాదు హింసోద్యమశాఖా స్థానములో విచారణలోఉన్నది- అయితే యీదర్జాదొంగలు హైద్రాబాదు ధనికులను మాత్రమే మోసముచేయలేదు- వీరు కర్నూలు మద్రాసు బొంబాయి మున్నగుచోట్లలో కూడ తమశక్తిని ప్రకటించినారు.అచ్చటి న్యాయస్థానాలలో కూడా వీరిపై అభియోగాలు ప్రవేశపెట్టబడినవి. ఈనుహా యిలను మాకోర్టులలో హాజరుపరచవలెనని వారుకోరినందున ఇంతలోవారిని ఆయాకోర్టులకు రవానాచేయనున్నారు.

---

# గోలకొండ గ్రంథాలయము

## శాంతిసమరము-(ఏకాంకనాటిక)

కర్తలు- శతావధానులు-సత్యదుర్గేశ్వర కవులు. మూల్యం రాఅణాలు- దొరకుచోటు-వి-హెచ్-వి-యస్-మూర్తి బ్రదర్సు. ఖాదీఅండ్ ఫేన్సీమార్టునందిగామ కృష్ణ.

కొన్ని సంవత్సరముల క్రిందట భారతదేశమునజరిగిన కాంగ్రెసు సత్యాగ్రహవిషయము ఇందుఇతివృత్తముగ తీసికొనబడినది. ఇందలిపాత్రలు, విజయ, ఇందిర, పండితుడు, మహాత్ముడు, భోగరాజు, యింకనుకొంతమందికలరు. గతసత్యాగ్రహమున ప్రజలుపడినకష్టములిందు విపులముగవర్ణింపబడినవి. సౌభాగ్యనగరపురాజమంత్రులకునుఇందుప్రవేశముకలదు. ఈనాటకమున పండితుడనువాతడు నాయకుడుగా కన్పించుచున్నాడు. "ఎన్నటికైనను భారతాంబస్వతంత్ర కాగలదను" దివ్యవాణియాశీస్సుతో నాటకముముగింపబడినది కవులువక్తవ్యాంశమునుచాలమట్టుకు నిపుణతతోలాగికొని వచ్చిరనవచ్చును. భాషలాక్షణికమునకగినను శిష్టవ్యావహారిక సంకలితముకాకపోలేదు.

ఈకవులప్రయత్నము మిగులసంతోష దాయకము.

## శ్రీబదరీకేదార యాత్రాసూచిక

సంపాదకులు. బ్ర. శ్రీ. అంబయ్య సిద్ధాంతిగారు. సంస్థానమునిర్మల. గ్రంథయితలు బాలకవి చొల్లేటినృసింహశర్మగారు. ప్రధానోపాధ్యాయుడునిర్మల ౧౨౭ పుటలు డెమ్మీసైజు వెల, ౦-౫-౦ దొరకుచోటు శంకరశాస్త్రిజ్యోతిష్యాలో దిసిప్రెస్ నిర్మల

లేక శ్రీరామాబుక్ డిపో, సికింద్రాబాదు ఇదిపైసంపాదకులే శైవచింతామణి గ్రంథమాల షష్ఠకుసుమము,

ఇందు యాత్రార్థులకుసంబంధించిన హరిద్వారం - ఋషీకేశం 3 దేవప్రయాగమున్నగు గల క్షేత్రములగురించినవిషయములు, వానిదూర ప్రమాణములు, పోదలచినవారికి వలసినసౌకర్యములు, వారుపట్టుకొనిపోవలసిన సామగ్రులును న్నగువానినిగూర్చి విపులముగ తెలుపబడినది. యాత్రార్థులకువయుక్తమైనదే. ఇదిఒకకేటలాగు. పందలకొలదియాపాయులు కర్చుపెట్టి యాత్రచేయువారుఅయిదణాలు కర్చుచేసి యీకేటలాగు తెప్పించుకొనవలెనని ఆశించెదము. దీనివెలను ౦-౫-౦ అణాలువరకుపెట్టిరి.

## శ్రీమాలోల పంచరత్న
## శ్రీమదాచార్య నక్షత్రమాలికే

కర్త వ్యాకరణశిరోమణి, గద్వాలసంస్థానధరాశిధికారులు, చిలుమూరుగ్రామాభిజనులునగు శ్రీమాడభూషి వెంకటరాఘవాచార్యులుగారు,

దొరకుచోటు, 871 F గిరిరాజ్-భవనం సుల్తాన్‌బజార్ హైదరాబాదు (దక్కన్) ఈ పుస్తకములకయువారు తమఅడ్రసుతోసహా ఒక అణాస్టాంపును పైఅడ్రసుకు పంపుకొనవలెను.

ఇందలిభాషసంస్కృతము,లిపి,దేవనాగరి మొత్తముపేజీలు ౧౦ మొదట ఆచార్యనక్షత్రమాలిక యనుపేరుతో శ్రీలక్ష్మీనృసింహస్వామిని గురించినవి ౨౭ శ్లోకములుగలవు, శ్రీవణిశఠకోపశ్రీరమానృకేసరి కారిజయతీశమహాదేశికాయనమః" అనునమస్కృతి గాక్యములోని యక్షరములలోనొక్కొక్క యక్షరమను శ్లోకారంభమునసుంచి ౨౭శ్లోకములను పూర్తిచేసినారు,

రెండవదిమాలోలపంచరత్నములు. ఇందులక్ష్మీస్తుతికలవు. ఆచార్యనక్షత్రమాలికయను పేరుచే లక్ష్మీనృసింహనాయులగు తనగురువులస్తుతించి ఎట్లగపడుచున్నది: ఈరచనబట్టిగ్రంధకర్త యొక్క అవర్గళపాండిత్యము, వ్యాకరణపరిజ్ఞానమును చక్కగాబోధపడుచున్నవి, మాతృభాష కాదరముతగ్గినయీకాలమున నిట్టివారుగీర్వాణభాషలో గ్రంథమునవతరింప జేయుటెంతయు ముదావహము శైలికొక్కయుదాహరణము,

"సుదాధారభూతో సదామోదశీలో వదాన్యోదయాభర్యశస్వే తపస్వీ ధరాదేవబృంహైస్సమారాధితాంఘ్రిస్సరక్మే హృదబ్జేవరీవర్తు నిత్యం॥

దీనిమూల్యము "భక్త్యాపఠనం" అనగాభక్తితోచదివినమూల్యమిచ్చినంత ఫలమనియెంచిగ్రంథకర్తలుదీనిసుచితముగ నీయుదలంచిముఖపత్రమున "మూల్యం భక్త్యాపఠనమ్" అనివ్రాసినారు

---

## ప్రతికాస్వీకారము

### విశ్వకర్ణాటక

ఇదికర్ణాటవారిపత్రిక బెంగుళూరునుండి వెలువడుచున్నది. సుమారు౨౦ పుటలతో ప్రతిసారివెలువడుచున్నది. ఇప్పుడుఆగా సంపుటమునడుచుచున్నది అనగాసుమారుఆ ఏండ్లను పైకాలమునుండి యిదినడుచుచున్నది. ఇదిసచిత్రవారపత్రిక. సంపాదకులు శ్రీమాన్ తిరుమల తాతా చార్యగారు వీరికి తెనుగులో గూడ పాండిత్యము కలదనియుతెలిసినది ఈపత్రికకుమంచివ్యాప్తి యున్నదనియు, కర్ణాటకపత్రికలలోఇదిచాలప్రఖ్యాతమైనదనీ కన్నడులఅభిప్రాయము. ఇందువార్తలు, వ్యాసములు, వ్యాఖ్యలు, బాలవిజ్ఞానము, కథలు, మున్నగునవిబహుళముగా ప్రచురితమగుచున్నవి. ఈపత్రికనునిజాంరాష్ట్రకర్ణాటకులు ఆదరించవలెను. సోదరసంస్థానమందుసోదరకర్ణాటకభాషలోఅద్వితీయమైన ప్రజ్ఞతోఉత్తమపద్ధతిపై నడుపబడుచున్నయీపత్రికకు సర్వదావిజయముకలుగుగాక.

---

## సావర్కర్‌గారు బీహారుహిందువులకు బుద్ధిచెప్పుట

బీహారులో మతకలహములనుగూర్చి బాబు రాజేంద్రప్రసాదు గారు ఇటీవలచేసిన ప్రకటనను గూర్చి హిందూమహాసభఅధ్యక్షుడగు వి డి. సావర్కర్ గారు విమర్శించుచు రాజేంద్రప్రసాదుగారు బీహారులోనిహిందువులకు బుద్ధిచెప్పినట్లే బెంగాలు ముసల్మానులకుకూడ బుద్ధి చెప్పవలెననివారు రాజేంద్రప్రసాదుగారు ఢక్కాలో అల్లరులను ఎందుకుఆక్షేపించలేదని సావర్కర్ గారుఅడుగుచున్నారు. దేశక్షేమాభిలాషియగు ప్రతివాడునుశాంతియు,సద్భావమున్ను తిరిగినిలువబడి, హిందువులును, ముసల్మానులును మంచిమైత్రితో ఉండుట ఎంతతొందరగా ప్రారంభమగునో, మనకందరికిని అంతమంచిది. కాని ముసల్మానులు కయ్యమునకు కాలుదువ్వుచర్యలుచేయుట మాననిచో, మొదటమొదట హిందువులు బాధపడవచ్చునుకాని ముసల్మానులుకూడ అనష్టమును భరించవలసివచ్చును. కయ్యమునకు కాలుదువ్వుటవల్ల తుదకుదానిఫలితము అసలువానిమీదనే పడగలదు. అదుష్ఫలితము తప్పించుకొనదలచినవారలు అది అసలురాకుండానే చూచుకొనవలెను"

---

అందరూ ఈరోజునుండే
పుచ్చుకొనుట ప్రారంభించండి.

ట్రేడు మార్కు

జాండు
ద్రాక్షాసవ

దేహమునకు మెదడునకు
ఉత్సాహమును గలిగించు
రుచ్యమైన ఔషధము.

జాండు ఫార్మా వర్క్సు లిమిటెడ్-బొంబాయి
నిజాం ఏజంట్లు:
మెసర్సు, డి. జె. పారెఖ్ అండుకో—శికింద్రాబాదు.

---

## వైస్రాయిగారితో ఫజ్లుల్‌హక్ గారి సంభాషణ

బెంగాలు ప్రధానియగు ఫజ్లుల్ హక్ గారు సిమ్లాలో వైస్రాయిదర్శనార్థమువ వతేదిన మీరట్ చేరినపుడు వారి దర్శించిఅడుగగా వారిట్లుచెప్పి యిగారినిదర్శించి, కేంద్రకా మైనంతవరకు అన్ని తెగలవా డునట్లుచేయుటకై భారతీయ త్వములోను రాష్ట్రీయ ప్ర గాచేర్చుకొనుట చాల అవ భారతదేశమును శత్రువులందరి కై భారతదేశమంతయు ఒక్క చుటకు పరిస్థితులను అనుకూలము తొందరపడుచున్నాను. అన్ని తెగల నిధులుగల ఒకగుండ్రబల్లమహాసభను భావిభా రాజ్యాంగమును నిర్ణయించుటకై సమావేశపరచుట ఆవసరమని వైస్రాయిగారికి చెప్పెదను."

---

## హిందూ ముసల్మానుల మైత్రి

### సింధు మంత్రుల నిశ్చయము

సింధురాష్ట్రమందు శాంతిరక్షణ బాధ్యతగల మంత్రియగు సర్ గులాంహుసేన్ హిదాయతుల్లాగారు మొన్నటిరాత్రి హిందూముసల్మానుల మైత్రిసాధనమునుగూర్చి ఆలోచించుటకై సమావేశపరచబడినసభలో ఉపన్యసించుచు "అల్లరులను రెచ్చగొట్టు బద్మాషులనైనను లేకుండచేయవలెను, లేదా నేనైనను ఉద్యోగమునుండి తొలగవలెను. అంతేగాని ఇరువురికిని సింధురాష్ట్రములో చో టులేదు శాంతముగా జీవనముగడపుకొను ప్రజల సుఖముగాఉండునట్లు చేయుటకై నేను నా ప్రాణముసైనను సమర్పించుటకు సర్వసిద్ధుడనై యున్నాను-ఎట్లయినను శాంతినిస్థాపించుటకై నేను నిశ్చయించుకొనియున్నాను. శ్రీరపాలక సంస్థలలో సంయుక్తనియోజకవర్గపద్ధతి నేర్పరచుటవలన హిందూముసల్మానులలో పరస్పరమైత్రి పెర్గుచున్నందుకు సంతోషించుచున్నాను. ఈరెండు తెగలవారలును ఒకరికష్టములనొకరు గ్రహించు చు, పరస్పరాదరణకలిగి, మైత్రితో జీవనమొనర్చినచోగాని ఈరాష్ట్రము సంపన్నముకాజాలదని నా దృఢవిశ్వాసము. సాధారణసంబంధములలో ఏమాత్రము విభూతముక నిపించినను, రెండు తెగలవారలకును అగణ్యమైన హానిగల్గును. మీరుగ్రామాలకుపోయి, గీతయును, ఖురానును చదువుట కనుకసమానమును సోదర భావమును బోధించునట్లు, కేర్వురు తెగలవారలున్మైత్రిగల్గియుండుటకు బోధించవలెనని మీకు మాసందేశము"

ఈసభకు సుక్కూరుజిల్లాలోని ప్రసిద్ధ హిందూముసల్మాను జమీందారులును, ప్రభుత్వ ఉద్యోగాధికారులును, కాంగ్రెసు, హిందూసభ నాయకులును వచ్చియుండిరి.

---

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ
## ( లిమిటేడ్ )
### హెడ్ ఆఫీసు:-మచిలీపట్నము

అత్యల్పమగు రేట్లతో అత్యధికమయిన హామీనిచ్చునది "ఆంధ్ర" మంచిఆర్థికబలంకలిగి వృధావ్యయంకాకుండా అభివృద్ధిని గాంచుచు తగుపాటిదినాదాయం కలవారికీకూడా తమజీవితముల భీమాచేయుటకు అందుబాటులోనున్నది ఆంధ్రభీమాసంస్థయే.

### మాయభివృద్ధిని గాంచుడు

| సంవత్సరము. | | క్రొత్తవ్యాపారం. | ప్రీమియంరాబడి. | భీమానిధి. |
|---|---|---|---|---|
| 1927 | ... | రూ. 6,32,500 | రూ. 44,330 | రూ. 29,000 |
| 1930 | ... | ,, 13,73,500 | ,, 1,93,000 | ,, 2,15,000 |
| 1933 | ... | ,, 19,42,000 | ,, 2,98,000 | ,, 7,16,000 |
| 1935 | ... | ,, 27,10,000 | ,, 4,60,900 | ,, 11,57,000 |
| 1939 | .. | ,, 35,29,000 | ,, 8,06,500 | ,, 26,30,000 |

రూ. 14 లక్షలు సర్కారువారియొద్దను, వారంగీకరించిన సెక్యూరిటీలలోను ఉంచబడినవి. అమలులోనున్న వ్యాపారం: రూ.1,60,00,000 మీరుభీమాచేయుటయేగాక, మీబంధుమిత్రాదులచే మావద్దభీమాచేయింపుడు.

పలుకుబడిగల ఏజంట్లు నిజాంరాష్ట్రమునందంతటను కావలెను.

వివరములకు వెంటనే క్రిందివారికివ్రాయుడు.

గాడేపల్లి జగన్నాథం,
చీఫ్ ఏజంట్
కింగ్సువే, సికింద్రాబాదు.

---

రాత్రికాలమందు
వేడిపాలతో
గ్లాస్కో బిస్కత్తులను
తీసికొనుడు

పీక్ ఫ్రియన్స్
గ్లాస్కో
బిస్కత్తులు

